శ్రీ వేంకటేశ్వరాయనమః

# శ్రీ వేంకటరమణ శతకము

రచయిత:
ప్రతాప రాఘవపాకీయ
బెజవాడ



పరిష్కర్తలు:
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు
శతావధానులు

శ్రీ వేంకటేశ్వరాయనమః

# శ్రీ వేంకటరమణ శతకము



రచయిత:

ప్రతాప రాఘవపాకయాజి



పరిష్కర్తలు:

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు

శతావధానులు

తే. పరమ భాగవతుఁడు శ్రీనివాసరాయఁ
డనఘుఁడైన కర్నూలి సదన్వయుండు
తనదు తల్లి భవానమ్మ మనసెఱింగి
అచ్చు వేయింగఁ గొంత సాయం బొనర్చె.

తే. ఓరుగంటి వేంకటరత్న మురుయశుండు
పచ్చిగోళ్ళ వంశ్యుండు సుబ్రాయగుప్త
వనమ వంశ్యుండు బ్రహ్మయ్యతనుభవుండు
కోటిరత్న సమాఖ్యుండు గురుహితుండు
మఱియుఁ గొందఱు ధర్మతత్పరులు దీని
నచ్చు వేయించి రలవారి కగుత శుభము.

(షట్పాది)

శ్రీ మత్పరదేవతాయై నమః

# తొలిపలుకు

ఈ వేంకట రమణ శతకము రచించిన రాఘవ పాకయాజి తిరుపతి వేంకటకవుల శిష్యుఁడ నని యిందేకాక మఱికొన్ని పద్యములలోఁగూడ వ్రాసినాఁడు. ఈ శిష్యత్వము కేవల మేకలవ్యశిష్యత్వము. నేఁటికి సుమారు 43 సం॥రముల నాఁడు గుంటూరి సీమలోని వేమవరాగ్రహారమున జరిగిన యవధానమునకుఁ బలువురు కవికిశోరములతోఁ బాటుగా నీతఁడును వచ్చెను. ఆ యవధాన పద్యములే కాక మా రచించినవి పెక్కులీతనికిఁ గంఠపాఠము. ఈయన గురుభక్తియు, దైవభక్తియుఁ గనుంగను వర్ణనీయములు. ఈయన ప్రవర్తనవంటి ప్రవర్తనకల బ్రాహ్మణులను వింటిని గాని చూడలేదు. యాదృచ్ఛికముగా నీశతకము నందు దొరలిన పద్యమొకటి యీయన సదుద్దేశములను వ్యక్తీకరించును. దాని నుదాహరింతును.

క. సతతము మద్గృహమందున
యతులను భక్తులను గవుల యజ్వలను బతి
వ్రతలను గుడువఁగఁ జేయు మ
వితథపు మృష్టాన్నములను వేంకటరమణా!

ఈయనకు నేను బరిచితుఁడ నైనను నా కీయన యపరిచితుఁడు. ప్రస్తుతము నేనీ బెజవాడలోనున్న

కారణమున నీ మధ్యకాలమున నా కీయన పరిచయము గల్గినందులకు సంతసింతును.

శ్లో॥ నహ్యమ్మయాని తీర్థాని నదేవా మృచ్ఛిలామయాః
తే పునం త్యురుకాలేన దర్శనాదేవ సాధవః॥

అను శ్రీమద్భాగవతశ్లోక మిట్టి యోగ్యుల పట్లనే సమన్వయింపఁ దగినది. ఈయన కర్మిష్ఠుఁడు. సనాతనాచార పరుఁడు. ఈయన భార్య మనుచరిత్రములోని—తే॥ గీ॥ వండ నలయదు వేవురు వచ్చిరేని" అను పద్యమునకు నుదాహరణమైన మహాసాధ్వి. నా కీయన శిష్యుఁడనని వ్రాసికొన్నవ్వా డీయనంగూర్చి నేను విస్తరించి వ్రాయుట పాడి గాకున్నను నాకుఁ గల్గిన యానందము నించుక వ్రాయక తప్పినది కాదు. ఈయననుగూర్చి నా సౌభాగ్యకామేశ్వరీ స్తవములో ని ట్లుదాహరించితిని. ఆ పద్యములు చూపి దీనిని ముగింతును.

మ. అతిచిత్రంబు ప్రతాప రాఘవకవి
వ్యాపార, మాతం డెటుల్
సతముం సాఁకెడి భక్ష్య భోజ్యములతో
సత్రమ్ముగా నిల్లు తా
నతిథుల్ రాఁగ నటే బుభుక్షకొఱకై
యభ్యాగతుల్ రాఁగఁ,' ద
త్కృతి కాశ్చర్యము పుట్టు, రిక్తుఁ డతఁ డో
దేవేశి కామేశ్వరీ! ౩౪౫

అను పద్యమును జ్ఞప్తికిఁ దెచ్చు నీ బ్రాహ్మ ణోత్తముని యాతిథేయత్వము నభినందించు టయుఁ గొండొక ధన్యత్వసంపాదకమని యీ నాల్గు మాటలును వ్రాసితిని. కారణము చెప్పఁ జాలను గాని మన రాజధానిలో నేపట్టణమందుఁ గాని యే పల్లెయందుఁగాని యీ బెజవాడలో నున్నంతమంది పుణ్యపురుషులు చిక్కరు. ఇందలి ధనికులోనున్న దీనజనావనము ప్రత్యేకించి పేర్కొనఁ దగినది. ఎందఱికో యీ దుర్గాక్షేత్రము జీవనమును కల్పించుచున్నట్లు కనిపెట్టితిని. సతతము గీతా భాష్యాదిశ్రవణము పురాణశ్రవణము వేదశా స్త్రజ్ఞసన్మానము లోనగు పుణ్యకార్యములు తర పరంపరగా నిందు జరుగుచుండును. లోకమం దెల్ల డలఁ గలి ప్రవేశించినను నియ్యెడ నింకను బ్రవేశింప లేదని నే ననుకొనుచుందును. దీనిని విస్తరించుట కిటఁదావు చాలదు. ఈ శతకకర్త ధన్యుఁడు, భక్తుఁడు, అన్నప్రదాత. ఈయనకు శ్రీ దుర్గాపరమేశ్వరి తోడ్పడుఁగాక! చిరాయురారోగ్య భాగ్యములొసంగి పూనిన పూనికను నెఱవేర్చి యశమందుఁ గాక!

వెం॥ శా॥ శతావధాని, బెజవాడ.

శ్రీః

శుభమస్తు, అవిఘ్నమస్తు,

శ్రీ వేంకటేశాయ నమః.

శ్రీరామజయము

# శ్రీ వేంకటరమణ శతకము

క. శ్రీయుత! యలమేల్మంగా
ఖ్యాయుత! కళ్యాణదాయకా! దేనికి నీ
సాయమె శతకమ్మునకున్
వేయిగతుల నాకు దిక్కు వేంకటరమణా! ౧

క. ఎక్కుడు చదువుల నెఱుఁగను
తిక్కనకవితఁ బఠించి తీరుగ నెట్లో
కొక్కిరిబిక్కిరి కూర్చితి
వెక్కిరిసించెదరు కవులు వేంకటరమణా! ౨

క. కరితో దోమయు నల భా
స్కరుతో మిణ్గురుపురుగును గడలికిఁ గొలనున్
సరిగాని యట్లు నీకున్
బెఱవేల్పులు సరియుఁ గారు వేంకటరమణా! ౩

క. కొందఱు స్కందుం డనియును
గొందఱు శివుఁడనుచుఁ దలఁచికొందురు; మఱియున్
గొందఱు భక్తులు నిను గో
విందుం డని తలఁచుచుందురి వేంకటరమణా! ౪

క. సేవింతురు నిను స్మార్తులు
సేవింతురు వైష్ణవులు నిసీ! శైవు లహో!
సేవింప సంశయింతురు
వేవిధములఁ జెపుదు మేని వేంకటరమణా! ౫

క. రక్షకుఁడవయ్యు జగతిని
రక్షించుచునుండి పెద్దరాజవగుచు నీ
వక్షమత వడ్డికాసుల
భిక్షకుఁ బొల్పడఁగ నేల? వేంకటరమణా! ౬

క. వేదమ్ములు దొంగిలి యీఁ
గాదని శఠియించు సోమకాసురు శిరమున్
ఛేదింప మీన మైతివి
వేదాంతశిరోవిభూష! వేంకటరమణా! ౭

క. కూర్మావతారమందున
నిర్మలమతి వీఁపుపైన నేర్పునఁ గొండన్
ధర్మస్వరూప! మొత్తవె?
పేర్మిని దేవతలఁ గావ వేంకటరమణా! ౮

క. పుడమిని జాపగఁ జుట్టియుఁ
గడలిని దా నుండ హేమకశిపుననుజునిన్
మడియింపవె! సూకరమై
విడనాడక జగతిఁ బ్రోవ వేంకటరమణా! ౯

క. నరహరివై ప్రహ్లాదునిఁ
గరుణించితి వంత హేమకశిపు నసువుల్గా
హరియించి యెల్ల జగముల
వెలపింపవె రౌద్రమూర్తి! వేంకటరమణా! ౧౦

క. వడుగవునై పుడమిని మూఁ
డడుగులు యాచించి ధరణి యాకాశము రెం
డడుగుల సరిపడ బలి నీ
పెడయడుగునఁ ద్రొక్క లేదె? వేంకటరమణా! ౧౧

క. శ్రీ పరశురాముఁడవు నయి
భూపతులబలమ్ముఁ దేజమును గొని కోపో
ద్దీపితుఁడ వగుచు నీ పృథి
వీపాలన సేయలేదె? వేంకటరమణా! ౧౨

క. దశరథరాముఁడ వవుచుఁ
బశుపతివిలు దుంచి సీతఁ బరిణయమై యా
దశముఖుశిరములు దుంపవె
విశృంఖల మహాస్సహాయ! వేంకటరమణా! ౧౩

క. బలరామమూర్తి వగుచును
హలమును జేఁబూని హస్తినాఖ్యపురమ్ముఁ
బలిమి నదిఁ ద్రోయ నెంచవె
విలసద్భుజబలవిహార! వేంకటరమణా! ౧౪

క. ఆచారంబని కొందఱ
నాచారం బనుట యొప్పదని బుద్ధుఁడవై
యేచి జగన్నాథములోఁ
బేచీల నణంచి తీవు వేంకటరమణా! ౧౫

క. లలిఁ గల్కి-వగుచు నలశం
బళ మనుగ్రామమున మంచి బ్రహ్మణ్యుండౌ
నలవిష్ణుశర్మ యింటను
వెలయంగాఁ దలఁతు వంట! వేంకటరమణా! ౧౬

క. పట్టంగలేరు వ్రతములఁ
బట్టంగాలేరు నిన్ను బహుక్రతువులచేఁ
బట్టెదరు భక్తి సత్రాల్
పెట్టియుఁ బట్టంగలేరు వేంకటరమణా! ౧౭

క. సతతము మద్గృహమందున
యతులను భక్తులను గవ్వుల యజ్వలను బతి
వ్రతలను గుడువఁగ జేయు మ
వితథపుమృష్టాన్నములను వేంకటరమణా! ౧౮

క. రక్షింపదు శాంతత్వము
రక్షింపదు నిఖిలభూతరక్షాకృతియుఁగ
రక్షించు భక్తి యొకటే
వీక్షించితి గ్రంథములను వేంకటరమణా! ౧౯

క. అకళంకు నిన్నుఁ జోరుగఁ
బ్రకటించు ప్రసేనునన్నుఁ బరిభవముల్ జొ
న్పక యతనికూఁతు సత్యను
వికచాంబుజనేత్రిఁ గొనవె! వేంకటరమణా! ౨౦

క. నీ మహిమ గాంచువారల
నీ మహిలోఁ గాంచఁజాల నెచట వెదకి నే
నా మెయి నజు పంచింపవె
వేమఱు నిను సన్నుతింతు వేంకటరమణా! ౨౧

క. తెలిసితి నీ చరితంబులఁ
గొలుచుచు నిను యోగినగుచుఁ గొండలరాయా!
నిలిచెద నీ కృపగల్గిన
విలసిల్లుచు నూఱు నేండ్లు వేంకటరమణా! ౨౨

క. తనువే నిలుపు మటులు కా
దనుచో నిఁకఁ బుట్టకుండునట్టు లొసఁగుమీ
వినుతు లొనర్తును సతతము
వినుమిది పెడచెవినిగాక వేంకటరమణా! ౨౩

క. విదురునిపై నరుపైనను
గుదురుగ నక్రూరుపైన గోపికలపయిన్
వెదఁజల్లు నీదుకృప నొ
ప్పిదముగ నామీఁదఁ జూపు వేంకటరమణా!

క. ఒంటరిగా వ్రజబాలిక
యింట న్నిదురించుచుండ నేగియు నా వా
ల్గంటిని-జీరితి వఁట! నే
వింటిని నీభాగవతము వేంకటరమణా! ౩౫

క. అన్నియుఁ దీర్థంబులు నీ
సన్నిధిలోఁ గలవు ముక్తిసంపత్తికినై
యెన్నియొ తావులు గొందఱు
పిన్నలవలెఁదిరుగుటేల వేంకటరమణా! ౩౬

క. మెట్టున రోటిని బెట్టిన
నట్టి యపుడు నందకున్న నొకపీఁట నటన్
బెట్టి పనంటికిఁ దూటున్
బెట్టవె? పాల్ద్రావుకొఱకు, వేంకటరమణా! ౩౭

క. కడవలలోఁ బాల్పెరుగును
బుడుతలకును బడుచులకును బోసి కడవలన్
దడబడఁ బగులఁగఁగొట్టియుఁ
బెడదారిని జనితివంట! వేంకటరమణా! ౩౮

క. ఒకభార్యయు రుక్మిణి యిం
కొకభార్యయు సత్యభామ యొక రిద్దఱె నీ
కకళంకలు గల రెందఱో
వికచాబ్జాక్షు లని విందు వేంకటరమణా! ౩౯

క. తిరిగితివి వెఱపు లేకయె
మరుగేమియు లేక వాండ్రు మగలుండఁగనే
సరిపడని పనులు చేసితి
వెఱిగొల్లలయిండ్ల నీవు వేంకటరమణా! ౩౦

క. పండరిపురవరమున నీ
వుండియు బహుభక్తజనుల నొగి నేలుచు బల్
దండన వడు చకుబాయికిఁ
బిండిని విసరంగలేదె? వేంకటరమణా! ౩౧

క. వసుదేవునికొమరుఁడవై
పసితనమున మద్దిచెట్లఁ బడఁద్రోసిస్త్రీమాలీ
మసఁ బూతన న్వధింపవె
విసమును రక్తమును గ్రోలి వేంకటరమణా! ౩౨

క. వాసిగల కపిలతీర్థము
వాసుకితీర్థమును శ్రీనివాసునికొలనుఁ
భాసిలుచుండఁగ నీకడ
వేసరి కాశిఁ జననేల? వేంకటరమణా! 33

క. ఉండవు వైకుంఠములో
నుండవు తిరుమలను నిలిచి యుండవు రవిలో
నుండెదవు భక్తిరసముఁ
బిండెడి సద్భక్తులిండ్ల వేంకటరమణా! ౩౪

క. వసనము లిత్తు యమునలో
వెనఁ గుసితోఁ జేతులెత్తి వినయము మెఱయన్
పసిఁజక్కఁ మ్రొక్కుఁడంచును
బిసబాహులతోడ ననవె? వేంకటరమణా! ౩౫

క. దేవతలలో గరిష్ఠుఁడ
వీవిధమునఁ గొంటెపనుల నెటు చేసెదవో
కోవిదులు నగుదురంచును
వేవిధముల వ్రేఁత లనరె? వేంకటరమణా! ౩౬

క. భరమగు కోపమ్మున సుం
దరి ద్రౌపదిచీర లొలువఁ దత్సభలో నీ
వరి దుశ్శాసనుకృత్యము
నెరవరివై యడఁపలేదె? వేంకటరమణా! ౩౭

క. ఆడితి గోపాలురతోఁ
బాడితి వా వేణుగీతి భామలసిగ్గుల్
వీడఁగఁ జేసితి చెలువలు
వేడఁగ వసనముల నీక వేంకటరమణా! ౩౮

క. క్రూరాత్ముఁడేని నీ యసి
ధారిఁ బడినవాఁ డొనర్చు పాపము లడఁగున్
జేరఁడె? కంసుఁడు దుష్టుఁడు
వీరస్వర్గమున కెలమి వేంకటరమణా! ౩౯

క. కూరిమి బాపఁడ నగుచున్
ధీరత గోర్కు లిడి ధరణిదేవుఁడ నగుచున్
గోరి భుజింతును విప్రుని
వేఱుగఁ దలఁపఁదగ దనవె? వేంకటరమణా! ౪౫

క. ఏటికి నీ సంసారము
దాఁటగఁ జాలఁగద? నేను దరిఁజేర్పుము నీ
బోటి మహాత్ముల నే నే
పీటను జూడంగఁ బోను వేంకటరమణా! ౪౬

క. ఆగ్రహము గలిగి యుండె న
వగ్రహములలోనఁ గొన్ని వానిదశల మం
దగ్రహము నడచుచుండె సు
విగ్రహ! నీవుండ భయమొ? వేంకటరమణా! ౪౭

క. పల్కుకుఁ బల్కుకు నమృతముఁ
జిల్కఁగ సిరి కల్కిమిన్న సేవింపఁగదున్
గుల్కెడు రెండవ చెఱకున్
విల్కాఁడవు నీవు గావె? వేంకటరమణా! ౪౮

క. చండతరంబగు రాక్షస
మండలమును భండనమున మార్కొని మఱి కో
దండమునన్ బడఁద్రోయవె?
బెదువడన్ జేసి నీవు వేంకటరమణా! ౪౯

క. నీలా! ఘనలీలా! మృదు
శీలా! శ్రీనందబాల! శ్రితజనపాలా!
నీలావణ్యం బెంచఁగ
వీలా? యెవ్వరికినైన వేంకటరమణా! ౫౦

క. చేయించి తెన్నొ యాత్రలు
వ్రాయించితి విపుడు నీమపైని శతకమున్
చేయింపఁదలఁచి వేలిమి
వేయింపవె! సక్రమముగ వేంకటరమణా! ౫౧

క. ముగ్గనొ? లేదో? యని కని
యెగ్గనకే శబరి యొసఁగ నెంగిలిఫలముల్
దగ్గఱ బాంధవ్యంబా?
బెగ్గలపడి తింటి వపుడు వేంకటరమణా! ౫౨

క. ఇప్పుడు కవిత్వమును నేఁ
జెప్పఁగ నుత్సాహపడియు జేజే యని నీ
కొప్పఁగఁజెప్పితి మెప్పొ
పెప్పే యనఁజేయకయ్యొ! వేంకటరమణా! ౫౩

క. నారాయణ! శ్రీజగదా
ధారా! శ్రీచిత్తచోర! ధరధర! మారా
కారా! మమ్మేలుము గం
భీరా! కల్మషవిదూర! వేంకటరమణా! ౫౪

క. శ్రీశా! యిపు డెపుడు నీ
దాసులదాసులకు దాసదాసులతో సా
వాస మొసఁగి సుకవి సమా
వేశము ఘటియింపుమయ్య! వేంకటరమణా! ౫౫

క. కృష్ణా! యిహసుఖ మను మృగ
తృష్ణకు నే లోనుగాక తేఁకువనై భ్రా
జిష్ణున్ జిష్ణున్ సాక్షా
ద్విష్ణు న్నినుఁ గొలుచువాఁడ వేంకటరమణా!

క. ఎందఱు తరియించిరి యే
సందియమున్ లేక నిన్ను స్మరియించి తుట్రిన్
పొందఁడె? వైకుంఠము గో
విందా! ఖట్వాంగవిభుఁడు వేంకటరమణా! ౫౭

క. పాలింపుము మమ్మెప్పుడు
దేలింపు భవాబ్ధినుండి దీనుఁడ నో గో
పాలుఁడ! పరమదయాళుఁడ!
పేలవముగఁ జూడఁబోకు వేంకటరమణా! ౫౮

క. ఎత్తితివి పెద్దకొండను
మొత్తితి వానాఁడు సోఁకుమూఁకల నలమే
సత్తను హత్తి రహించితి
వేత్త లెఱుఁగువారు నిన్ను వేంకటరమణా! ౫౯

క. రాముఁడవు నీవె, అలబల
రాముఁడవును నీవె, పరశురాముఁడ వీవే
సోముఁడవు నీవె, యారణ
భీముఁడవును నీవె, తలఁప వేంకటరమణా! ౬౦

క. తిరుమలలో రాజ్యము కే
సరిగిరిఁ జందనపురస మొసఁగఁ బానకమున్
బొరిఁబొరి మంగళగిరిఁ దా
వి రంగమున నిద్రగొందు వేంకటరమణా! ౬౧

క. ప్రారంభించితి నీనుతి
ప్రారంభించినది మొద లపారమయిన వా
గ్ధార యుదయించె నాకున్
నీటేఁడి నన్నెఱుఁగవా యిప్పుడు! వేంకటరమణా! ౬౨

క. ఎన్నో దినములుగా నిన్
సన్నుతిఁ జేయందలంతు సత్కృతితో వి
ద్వన్నుత! సమకూర్పఁగ దే
వెన్నుఁడ! విఘ్నము లడంచి వేంకటరమణా! ౬౩

క. దోసము లెన్నియొ చేసియుఁ
గాసైనను విడువ కేను గడియించితి నా
యాసపడి చేయ ధర్మము
వీసమయిన ముక్కి యెటు వేంకటరమణా! ౬౪

క. కొట్టితిని భేరి మీకృప
నెట్టితిఁ బద్యములు కొన్ని నేర్పుగను దుదన్
ముట్టింపుము గ్రంథమ్మును
బెట్టెద దండములు నీకు వేంకటరమణా! ౬౫

క. మత్తత నీపదభక్తిన్
జిత్తము హత్తించి సేవఁ జేయనయితి వి
ద్వత్త గలవాఁడనా? దు
ర్వృత్తుఁడ ననుఁ బ్రోవుమయ్య! వేంకటరమణా!

క. కలవార లెందఱెక్కలిఁ
గలుములు లేనట్టివారు గల రెందఱు భూ
స్థలిఁ గలిమి నిక్కమగునే!
విలపింతురు ధనము కొఱకు వేంకటరమణా! ౬౭

క. అంతయు మిథ్యయె తలఁపఁగ
నెంతురు నిక్కమని యెందఱెందఱొ మదిలోఁ
సంతస మొందుచు నుండుట
వింతగ నున్నదిగదయ్యా! వేంకటరమణా! ౬౮

క. చాల దినమ్ములకిందట
మేలొనరింపం దలంచి మేకొని యెన్నో
లీలలు చూపియుఁ దత్త్వము
వీలుగ బోధింపలేదె! వేంకటరమణా! ౬౯

క. నిరుపమగతి గల్గును నీ
దరిఁజేరిన భాగవతుల దర్శించుటచేఁ
గరుణానిధి జగదీశ్వర!
బిరబిర ననుఁ గావరావె! వేంకటరమణా! ౨౦

క. నినుఁ దల్లి త్రైదములోఁగనెఁ
బనిచేక మతి మాఉదల్లి పాలఁ దాగ్రిన
దనుజాంతక! నీ చరితము
విన వేడుక గల్గునయ్య వేంకటరమణా! ౨౧

క. ఒకతల్లి కడుపునం బడి
యొకతల్లికిఁ బుట్టినట్టి యొడయుండవతఁ డ
న్నకదా! నీకుఁ మిక్కిలి
వికటము నీవంశగరిమ వేంకటరమణా! ౨౨

క. నీ వెల్ల దిశల నుందువు
నీ వుండనిచోటులేదు నిగమస్తుత్యా!
నీ వందటి హృదయమ్ముల
వే విధముల నుండి ప్రోతు వేంకటరమణా. ౨౩

క. కందములని యొడి కుసుమము
లందమ్ముగ సరముగూర్చి యందించెద నీ
సుందరకంఠమునఁ గో
విందా! ధరియింపుమయ్య! వేంకటరమణా! ౨౪

క. తిరుపతి వేంకటకవి వర
గురులను బ్రార్థించి కవిత గూర్తు నిపుడు నో
కరుణాకర! యిఁక నాకున్
వెఱపు రవంతయును లేదు వేంకటరమణా! ౨౫

క. పరమోత్తమగురువులకున్
గురువులయిన వారలకును గురుఁడవుకద! నే
నెఱుఁగమి నడిగెద నే వా
వి? రాధకును నీకుఁ దెలుపు వేంకటరమణా! ౨౬

క. ఇంటికి బిచ్చానకు రా
నంటుకొనెన్ నీదుచెలియ లందఱి విడి నీ
వెంటఁబడి రాదె? రుక్మిణి
వింటిని మీయింటిగరిమ వేంకటరమణా! ౨౭

క. పట్టితి శంఖముఁ జక్రము
బట్టఁగ నాగలిని నన్న భాగములోనన్
బెట్టితి విది న్యాయమె సరి
పెట్టిన సరిపోవు టెట్లు? వేంకటరమణా! ౨౮

క. సుందరులందున్ నందను
లందున్ ఘనమందిరములయందున్ వాంఛన్
జెంది రమించుచు నిను గో
విందా! యనరేమి! సామి! వేంకటరమణా! ౨౯

క. తిరుమల వైకుంఠం బగుఁ
దిరుమల కైలాసమగును దీర్థములెల్లన్
దిరుమలయందే యున్నవి,
పెఱతీర్థము లేగనేల వేంకటరమణా! ౮౦

క. శిష్టుల రక్షించుటకై
యష్టమగర్భమున భగవదంశన్ గంసున్
దుష్టు వధించుటకై యుప
విష్టుఁడవై పుట్టినావు వేంకటరమణా! ౮౧

క. సారము లేనిది యీసం
సారము తరియించుకొఱకు సారెకు నిన్నున్
గోరి భజించెద నన్నున్
వేఱుగ గణియింపఁ బోకు వేంకటరమణా. ౮౨

క. రాతి నడవి దాఁకియు నల
కోఁతుల గోళ్ళంటినీదు కోమలపదకం
జాతములు కందెఁగద! నం
ప్రీతిన్ బరిచర్యఁజేతు వేంకటరమణా! ౮౩

క. రాగద్వేషంబులు నే
త్యాగముఁ జేయంగఁజాలఁ దరిజేర్చి యెటో
భోగిందశాయి! నన్నున్
వేగమ రక్షింపుమయ్య! వేంకటరమణా! ౮౪

క. కరిలోనఁ గిరిలోనఁ
హరిలో ననలంబులోన నంబుధిలోనఁ
ధరలోనఁ గల వుంటివి
వెఱిగొల్లలలోనఁగూడ వేంకటరమణా! ౮౫

క. కోరను రాజ్యసుఖంబును
గోరను నే నాకసుఖము గోరను ముక్తిఁ
గోరుదు నీ కారుణ్యము
వేఱెయ్యది కోరనింక వేంకటరమణా!. ౮౬

క. ఛిద్రిపు గావంచాను ద
రిద్రింపు కుచేలుఁ జెలిమిఁ బృథుకముల నెటో
భద్రముగ ముడిచి యిడఁగఁ
విద్రిమములు మణులు సడవె! వేంకటరమణా!

క. దండము పాండవపక్షా!
దండము కరుణాకటాక్ష! దానవశిక్షా!
దండము మునిజనరక్షా!
వెండేనుఁగు నెక్కు దక్ష! వేంకటరమణా! ౮౮

క. ఎండకుఁ గల్వలగతిఁ దా
యుండును మఱి నీదునండ నుండనిచో నీ
యండ మదిఁ గోరువారికి
వెండియిడుదు బంగరిడును వేంకటరమణా! ౮౯

క. ముడుపులు బంగరుకణికలు
నుడుపులుఁ గడుభక్తి నీకు నొసఁగఁగ వేడ్కన్
దొడవుల నిలువుగ బలుదో
పిడిదొంగంబోలెఁ గొందు వేంకటరమణా! ౯౫

క. శ్రీ కనకదుర్గతల్లి న
నేకవిధంబుల భజించి యీగతిఁ బుణ్య
శ్లోకు నినుఁ బొగడఁ జాలితి
వీఁకన్ గృపఁ జూడుమయ్య! వేంకటరమణా!

క. నిను గొప్పఁజేయు నొక్కఁ
డనఁదగదటుశివుఁడే, గొప్పయని యొక్కఁడనున్
గనుఁగొనఁజాలక తత్త్వము
పెనుతురు వాదముల నిల్లు వేంకటరమణా! ౯౭

క. ఎన్నఁడుఁ బౌరోహిత్యం
బెన్నఁడు మాఠాధిపత్య మెపుడుఁ బరాన్నం
బు న్నాకు నున్నఁజేయుము
వెన్నుఁడ! యేజన్మమునను వేంకటరమణా! ౯౮

క. పలుకరు తక్కిన వేల్పులు
పలువిధముల వేడినన్ దపంబు సలిపినన్
ఫలము లొసంగిన నీవే
పిలిచినఁ బలికెదవు దేవ! వేంకటరమణా! ౯౯

క. మంగళము లోకనాయక!
మంగళ మోశ్రీనివాస! మహీధరనిలయా!
అంగజజనకా! శ్రీతిరు
వెంగళపతి! మంగళమ్ము వేంకటరమణా! ౧౦౦



సీ. శ్రీ పరితాపకులాబ్ధి శీతాంశుఁడగు నాదు
ప్రపితామహుండు సుబ్బన వధాని
వేదాదివేత్తయౌ వేంకటశాస్త్రి యు
ద్దాముండు నాదు పితామహుండు
బహుతపోధనుఁడగు బసవావధాని స
ద్ధర్మజ్ఞుఁ డతఁడు నా తండ్రిగారు
ధవుఁడే తనకు ముఖ్యదైవతం బనియెంచు
సాధ్వి శ్రీవరలక్ష్మి జనని నాకు
బ్రహ్మవిద్యాబోధపరుఁడు రామయశాస్త్రి
యఖిలార్థవేత్త నా యగ్రజుండు
పార్థివలింగ సపర్యా పరుండు సు
బ్బావధాని వేరొక్క యగ్రజుండు
అనఘ! రాఘవ పాకయాజి యనంబడు
వాఁడ నిన్నే వేళ వేడువాఁడ
భవదీయ కరుణకుఁ బాత్రుఁడు కొడుకు రా
ధాకృష్ణశాస్త్రి త్వద్భక్త వరుఁడు

గీ. భార్యనాకు సరస్వతి; యార్యులయిన
సరస తిరుపతి వేంకటేశ్వరులు గురులు
నీ వుపాస్యదైవతమవు నిగమవినుత!
వేంకటేశ్వర! కృతిగొమ్ము వినుతిఁ జేతు.

శ్రీ వేంకటేశ్వరాయనమః

# శ్రీ వేంకటరమణ శతకము

రచయిత:
ప్రతాప రాఘవపాకి
బెజవాడ



పరిష్కర్తలు:
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు
శతావధానులు